తా॥ ఎల్లప్పుడు నీ పాద పద్మములను స్మరింతుము
అప్పుడు భక్తిభావము స్థిరమౌతుంది. మాయామయ
మైన ఈ జగత్ భావన నుంచి మమ్ముద్ధరింపుము.
సాయినాథా! నీకు సాష్టాంగ నమస్కారము.

వసేజో సదా దావయా సంతలీలా।
దిసే అజ్ఞ లోకాపరీ జో జనాలా।
పరీ అంతరీ జ్ఞాన కైవల్యదాతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 3

తా॥ సత్పురుషులకు ఎల్లప్పుడు లీలలుచూపుతూ, మాతో
వుంటూ అజ్ఞానివిగా కనబడతావు. కాని ఆంతర్య
ములో నీవుమహాజ్ఞానివి. సాయినాథా! నీకు సాష్టాంగ
నమస్కారము.

భరా లాధలా జన్మహా మానవాచా।
నరాసార్థకా సాధనీభూత సాచా।
ధరూసాయి ప్రేమాగళాయా అహంతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 4

తా॥ మానవరూపమునవచ్చి, నరుల సార్థకతకు సాధనా
భూతుడవైనావు. నిరహంకారులమై ప్రేమతో నీకు
నమస్కరిస్తాము. ఓ సాయినాథా! నీకునమస్కారము

ధరావే కరీసాన అల్పజ్ఞ బాలా।
కరావే అహ్మా దస్య చుంబోనిగాలా।
ముఖీ ఘాల ప్రేమే ఖరా గ్రాసఆతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 5

తా॥ అల్పబాలురమైన మమ్ము నీచేతితోపట్టుకుని ముద్దిడి ధన్యులను జేయుము. నీ ప్రసాదమును మా నోటిలో వేయుము. ఓ సాయినాథా! నీకు సాష్టాంగ నమస్కారము.

సురాదీక జ్యాంచ్యా పదా వంద్రితాతీ।
శుకాదీక జాంతే సమానత్వదేతీ।
ప్రయాగాది తీర్థే పదీ న్రమహెూతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 6

తా॥ దేవతలు సహితము ఎవరి పాదములకు నమస్కరింతురో, శుకాదిమునులు ఎవరికి సమానత్వమిస్తారో, ప్రయాగాది తీర్థములు నమ్రతతో ఎవరి పాదముల చెంత చేరునో అట్టి ఓ సాయినాథా! నీకు సాష్టాంగ నమస్కారము.

తుఝ్యా జ్యాపదా పాహతా గోపబాలీ।
సదా రంగలీ చిత్స్వరూపీ మిళాలీ।
కరీ రాసక్రీడా సవే కృష్ణనాథా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 7

తా॥ నీపాద పద్మములను చూచిన గోపికలు రాసక్రీడలు సల్పుచు నీ చిత్స్వరూపములో కలిసిపోయినారో, అట్టి కృష్ణరూపుడవైన ఓసాయినాథా! నీకు సాష్టాంగ నమస్కారము.

తులా మాగతో మాగణే ఏకథ్యావే।
కరా జోడితో దీన అత్యంత భావే।
భవీ మోహనీ రాజ హోతారి ఆతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 8

తా॥ ఈమాయా మోహితమైన భవసాగరమును దాటించి తరింపజేయుమని, చేతులను జోడించి, అత్యంత దీనుడనై నిశ్చలభక్తితో నిన్ను ప్రార్థిస్తున్నాను ఓ సాయినాథా! నీకు సాష్టాంగ నమస్కారము.

## 9 ప్రార్థన

ఐసాయే ఈబా। సాయిదిగంబరా।
అక్షయరూప అవతారా సర్వహి వ్యాపకతూ।
శృతిసారా। అనసూయాత్రికుమారా।
మహారాజే ఈబా॥ 1

తా॥ ఓ సాయి దిగంబరా! అక్షయరూపుడా! అవతార పురుషుడా! ఇటురమ్ము. నీవు సర్వవ్యాపకుడవు. వేద విదుడవు. అనసూయ-అత్రి మహర్షులకు పుత్రుడవైన ఓ మహారాజా! ఇటురమ్ము.

కాశీ స్నానజప ప్రతిదివశీ। కోల్హాపురభిక్షేసీ।
నిర్మలనది తుంగా। జలప్రాశీ। నిద్రా మాహురదేశీ।
ఐసాయే ఈబా॥ 2

తా॥ నీవు ప్రతిరోజు కాశీక్షేత్రములో స్నాన-జపములు చేసి, కొల్హాపురమున భిక్ష గ్రహించి, నిర్మలమైన

తుంగభద్రానదీ జలాలతో దాహమును తీర్చుకొని, మాహూరీపుర క్షేత్రములో విద్రించెదవు. ఓ సాయి దిగంబరా! ఇటురమ్మ్మ.

ఝోళిలోంబంతసే వామకరీ। త్రిశూల ఢమరూధారీ।
భక్తావరద. సదా సుఖకారీ। దేశిల ముక్తీ చారీ।
ఐసాయే ఈబా॥ 3

తా॥ ఎడమచేతిలో జోలెను ధరించి, త్రిశూలమును, ఢమరుకమును ధరించి, ఎల్లప్పుడూ భక్తులకు వరములు, సుఖములు, ముక్తిని ప్రసాదించు సాయి దిగంబరా! ఇటురమ్మ్మ.

పాయిపాదుకా జపమాలా। కమండలూ మృగఛాలా।
ధారణ కరశీబా। నాగజటా ముగుటశోభతో మాథా।
ఐసాయే ఈబా॥

తా॥ పాదములకు పాదుకలు ధరించి, జపమాలా, కమండలము పట్టుకుని, మృగచర్మమును ధరించి, నాగజటాముగుట శోభతో వెలుగొందుచున్న సాయి దిగంబరా! ఇటురమ్మ్మ.

తత్పర తుఝ్యాయా జేధ్యానీ। అక్షయత్యాంచే సదనీ।
లక్ష్మీవాసకరీ దినరజనీ। రక్షసి సంకటవారుని।
ఐసాయే ఈబా॥ 5

తా భక్తిశ్రద్ధలతో నిన్ను ధ్యానించేవారి గృహములందు లక్ష్మి ఎల్లప్పుడు వుంటుంది. వారి సంకటములను తొలగించే సాయిదిగంబరా! ఇటురమ్మ్మ.

యాపరి ధ్యాన తుఝే। గురురాయా దృశ్యకరీ
నయనాయా।
పూర్ణానంద సుఖే హీకాయా। లావిసి హరిగుణగాయా।
ఐసాయే ఈబా। సాయిదిగంబరా
అక్షయరూప, అవతారా। సర్వహివ్యాపకతూ।
శృతిసారా! అనసూయాత్రి కుమారా।
మహారాజే ఈబా॥ 8

తా॥ ఓ గురురాయా నాకు నీపై ధ్యానము కుదురునట్లు నా కండ్లతో నీ రూపమును నేను దర్శించి పూర్ణానందము పొందునట్లు చేయుము. నీ గుణములను గానముచేయుచు, ఆనందము పొందునట్లు చేయుము ఓ సాయి దిగంబరా। ఇటురమ్ము.

# 10 శ్రీ సాయినాథ మహిమ్న స్తోత్రము

సదా సత్స్వరూపం చిదానందకందం
జగత్సంభవస్థాన సంహారహేతుమ్।
స్వభక్తేచ్ఛయా మానుషం దర్శయంతం
నమామీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 1

తా॥ ఎల్లప్పుడు స్వ స్వరూపుడవు, ఆనందము కలిగించువాడవు, సృష్టి-స్థితి-లయ కారుడవు, భక్తుల కోరికల ననుసరించి దర్శనమిచ్చువాడవుఅగు ఈశ్వరస్వరూపుడైన సద్గురు సాయినాథునకు నమస్కరించుచున్నాను

భవధ్వాంత విధ్వంస మార్తాండ మీడ్యం
మనో వాగతీతం మునిర్ ధ్యాన గమ్యమ్।
జగద్వ్యాపకం నిర్మలం నిర్గుణత్వాం
నమామీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 2

తా॥ సంసారమనే అజ్ఞానాంధకారమును నశింపచేయు సూర్యుడవు. మనస్సుకు-వాక్కుకు అందని వాడవు. మునుల ధ్యానమునకు గమ్యానివినీవే. ఈజగత్తంతయువ్యాపించి యుండి, నిర్మలము నిర్గుణత్వము గల ఈశ్వరరూపుడైన సద్గురు సాయినాథునకు నమస్కరించుచున్నాను

భవాంబోధి మగ్నార్దితానాం జనానాం
స్వపాదాశ్రితానాం స్వభక్తి ప్రియాణామ్।
సముద్ధారణార్థం కలౌసంభవంతం
నమామీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 3

తా॥ సంసార సాగరములో మునిగియున్న జనులను, నీ పదాశ్రితులను, నీ భక్తులను, ప్రేమతో ఉద్ధరించుటకు ఈ కలియుగములో అవతరించిన, ఈశ్వర రూపుడైన సద్గురు సాయినాథునకు నమస్కరించుచున్నాను.

సదానింబవృక్షస్య మూలాధివాసాత్
సుధాస్రావిణం తిక్తమప్య ప్రియంతం।
తరుం కల్ప వృక్షాధికం సాధయంతం
నమా మీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 4

తా॥ ఎల్లప్పుడు వేపచెట్టు మూలములో నివసించి, ఆ చెట్టులోని చేదుపోవునట్లుగా అమృతమును స్రవింప చేసి, ఆ చెట్టును కల్పవృక్షము కంటే అధికమైన దానినిగా చేసిన ఈశ్వరరూపుడైన సద్గురు సాయి నాథునకు నమస్కరించుచున్నాను.

సదా కల్ప వృక్ష స్య తస్యాధి మూలే।
భవద్భావ బుద్ధ్యా సపర్యాది సేవామ్।
నృణాం కుర్వతాం భుక్తి ముక్తి ప్రదంతం
నమా మీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 5

తా॥ ఎల్లప్పుడు ఆ కల్పవృక్షపు మొదటలోవున్న నిన్ను వారివారి యిష్టానుసారము, సపర్యలు, సేవలు చేయు నరులకు భుక్తిని ముక్తిని ప్రసాదించు ఈశ్వరరూపుడైన సద్గురు సాయినాథునకు నమస్కరించుచున్నాను

అనేకాశ్రుతా తర్క్య లీలా విలాసై
సమా విష్కృతేశాన భాస్వత్ప్ర భావమ్
అహం భావ హీనం ప్రసన్నాత్మభావమ్
నమా మీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 6

తా॥ అనేక విధములైన లీలా విలాసములు ప్రసాదించ గలవాడు, ఈశాన్యమున సూర్యకాంతిని ప్రకాశింప జేయువాడు, అహంభావము లేనివాడు, ప్రసన్నాత్మ భావమును కలిగియున్నవాడైన ఈశ్వరరూపుడైన సద్గురు సాయినాథునకు నమస్కరించుచున్నాను.

సతాం విశ్రమా రామ మేవాభి రామం
సదా సజ్జనైః సంస్తుతం సన్నమద్భిః।
జనామోదదం భక్త భద్ర ప్రదంతం
నమా మీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 7

తా॥ సత్పురుషుల విశ్రాంతి స్థానమై, ఎల్లప్పుడు సజ్జనులచే స్తుతింపబడుచూ, జనులను ఆనందింప జేయు భక్తుల భద్రత చేకూర్చు, ఈశ్వరరూపుడైన సద్గురు సాయినాథునకు నమస్కరించుచున్నాను.

అజన్మాద్యమేకం పరంబ్రహ్మ సాక్షాత్
స్వయం సంభవం రామమేవావ తీర్ణమ్।
భవద్దర్శనాత్సం పునీతః ప్రభో ఽ హం
నమా మీశ్వరం సద్గురుం సాయినాథమ్ 8

తా॥ జన్మకర్మలకతీతుడవు. సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడవు; రామునివలె సంకల్పముచే సృష్టించుకున్న స్వయంభువువు. ఓ ప్రభో; నీ దర్శనంచేత మేము పునీతులమవుతాము. ఈశ్వరరూపుడైన సద్గురు సాయినాథునకు నమస్కరించుచున్నాను.

శ్రీసాయీశ కృపానిధే ఽ ఖిలనృణాం సర్వార్థసిద్ధిప్రద
యుష్మత్పాదరజః ప్రభావమతులం ధాతాపివక్తా ఽ
క్షమః।
సద్భక్త్యా శ్శరణం కృతాంజలిపుట సంప్రాపితో ఽ
స్మిప్రభో

శ్రీమత్సాయి పరేశ పాద కమలాన్ నా న్యచ్ఛరణ్యం
మమ॥ 9

తా॥ ఓ సాయి కృపానిధీ! అఖిల మానవకోటి కోరిన అన్నికోర్కెలను తీర్చు నీయొక్క పాదధూళి మహిమ ఎంతటిదో బ్రహ్మదేవునికైనా వర్ణింప శక్యముకాదు. సద్భక్తితో చేతులుజోడించి నిన్ను శరణుపొందితిని.

సాయి రూప ధర రాఘవోత్తమం
భక్త కామ విభుధ ద్రుమం ప్రభుమ్।
మాయ యోప హత చిత్త శుద్ధ యే
చింత యామ్యహ మహర్నిశం ముదా॥ 10

తా॥ సాయి రూపమును ధరించిన రాఘవుడవు. భక్తుల కోర్కెలు తీర్చే ప్రభువువు. మాయ చేత కప్పబడిన నా చిత్తమును, నిర్మలపరచు కొనుటకు సంతోషముతో రాత్రింబవళ్ళు నిన్నే తలచెదను.

శరత్సుధాంశుప్రతిమం ప్రకాశం
కృపాత పత్రం తవసాయినాథ।
త్వదీయ పాదాబ్జ సమాశ్రితానాం
స్వచ్ఛాయ యా తాప మపాకరోతు॥ 11

తా॥ ఓ సాయనాథా! నీవు శరత్ చంద్రునివలె ప్రకాశించు కృపాసాగరుడవు. నీ పాదాబ్జముల నాశ్రయించిన వారికి అభయమిచ్చి వారి తాపమును పోగొట్టెదవు.

ఉపాసనా దైవత సాయినాథ।
స్త్వైర్మయోపాసని నాస్తు తస్త్వమ్।
రమేన్మనోమే తవపాద యుగ్మే।
భృంగో యథాబ్జే మకరందలుబ్ధః॥ 12

తా॥ ఉపాస నా దైవమైన ఓ సాయినాథా। ఉపాసించే భక్తులచే స్తుతింపబడతావు. తేనె కొఱకు తుమ్మెద కమలమును చేరునట్లు నా మనస్సు సదా నీపాదముల యందే యుండును.

అనేక జన్మార్జిత పాప సంక్షయో
భవేద్భవత్పాద సరోజ దర్శనాత్
క్షమస్వ సర్వా నపరాధ పుంజకాన్
ప్రసీద సాయీశ సద్గురో దయానిధే॥ 13

తా॥ నీయొక్క పాదకమల దర్శన మాత్రముచేత అనేక జన్మల పాపములు నశించును. ఓ దయానిధి। ఓ సాయి సద్గురో। నేను చేసిన తప్పులను మన్నించి నాకు ప్రసన్నుడవుకావయ్యా.

శ్రీ సాయినాథ చరణామృత పూత చిత్తా।
స్తత్పాద సేవ నరతా సతతంచ భక్త్యా।
సంసార జన్య దురితౌఘ వినిర్గ తాస్తే।
కైవల్యధామ పరమం సమవాప్నువంతి॥ 14

తా॥ శ్రీ సాయినాథుని పాదముల యందు పూర్ణమైన మనస్సునుంచి, ఆ పాదసేవ ఎల్లప్పుడు చేయుభక్తులు

సంసార జన్మ-కర్మ సంబంధమైన దురితముల నుండి విముక్తులై కైవల్యమును పొందెదరు.

స్తోత్రమే తత్పఠే ద్భక్త్యా యోనరస్తన్మనాస్సదా।
సద్గురో సాయినాథస్యకృపా పాత్రం భవే
ధ్రువం॥ 15

తా॥ ఎవరైతే ఈ స్తోత్రమును భక్తితో పఠించునో వాడు సద్గురువైన సాయినాథుని కృపకు పాత్రుడు కాగలడు. యిది యదార్థము.

# 11 ప్రార్థన

కరచరణ కృతం వాక్కాయజం కర్మజంవా
శ్రవణ నయనజం వా మానసం వాఽ పరాధమ్।
విదిత మవిదితం వా సర్వమేతత్ క్షమస్వ
జయ జయ కరుణాబ్ధే శ్రీ ప్రభో సాయినాథ॥
శ్రీ సచ్చిదానంద సద్గురు సాయినాథ్ మహారాజ్‌కి జై

తా॥ చేతులతో, కాళ్ళతో, మాటలతో, శరీరముతోచేయు పనులద్వారాగాని, వినుట - చూచుటద్వారాగాని, మనస్సుకాని, తెలిసియో, తెలియకయో నేను చేసిన సర్వాపరాధములను క్షమించవలసినది. కరుణా సాగరుడవైన ఓ సాయినాథ ప్రభో। నీకు జయము, జయము.

రాజాధిరాజ యోగిరాజ పరబ్రహ్మ శ్రీ సాయినాథ్ మహారాజ్ మధ్యాహ్న హారతి సమాప్తము.

# సాయం సంధ్యా ఆరతి

ప్రతి రోజు సాయంత్రము గం. 6-15 లకు (సూర్యాస్తమయమునుబట్టి ఆరతి సమయము మారును) ధూప - దీప నైవేద్యానంతరము ఒక వత్తితో ఆరతి ఇవ్వవలెను. మేలురకము సాంబ్రాణితో ధూపము బాగా వేయవలెను. ఈ హారతిని ధూప హారతి అని కూడ అందురు.

## 1 ఆరతి

ఆరతి సాయిబాబా। సౌఖ్య దాతార జీవ।
చరణ రజతాలి। ద్యావా దాసా విసావా।
భక్తా విసావా। ఆరతి సాయిబాబా॥ 1

జాళునియా అనంగ। స్వస్వరూపీ రాహేదంగ।
ముముక్ష జనదావీ। నిజడోళా శ్రీరంగ।
డోళా శ్రీరంగ। ఆరతి సాయిబాబా॥ 2

జయా మనీ జైసాభావ। తయాతైసా అనుభవ।
దావిసి దయాఘనా। ఐసి తుఝీహి మావ।
తుఝీహి మావ। ఆరతి సాయిబాబా॥ 3

తుమచే నామధ్యాతా। హరే సంసృతి వ్యథా।
అగాధ తవ కరణీ। మార్గదావి సీ అనాథా।
దావిసీ అనాథా। ఆరతి సాయిబాబా॥ 4

కలియుగీ అవతార। సగుణబ్రహ్మ సచారా।
అవతీర్ణ ఝూలాసే। స్వామీ దత్త దిగంబర।
దత్త దిగంబర। ఆరతి సాయిబాబా॥ 5

అతా దివసా గురువరీ। భక్త కరీ తివారీ।
ప్రభుపద ప హవాయాః భవ భయా నివారీ।
భయా నివారీ। ఆరతి సాయిబాబా॥ 6

మాఝా నిజద్రవ్యఠేవ త వచరణ రజసేవ।
మా గణే హేచి అతా। తుహ్మ దేవాధిదేవా।
దేవాధి దేవా। ఆరతి సాయిబాబా॥ 7

ఇచ్ఛితా దీనచాతక। నిర్మలతోయ నిజసూఖ।
పాజవే మాధవాయా। సంభాళ అపూలి బాక।
అపూలి బాక॥ ॥ ఆరతి ॥ 8

(తాత్పర్యము 33వ పేజీలో)

# 2 పాట

శిరిడి మాఝే పండరపుర। సాయిబాబా రమావర।
బాబా రమావర! సాయిబాబా రమావర॥

శుద్ధ భక్తి చంద్రభాగా। భావ పుండలీక జాగా।
పుండలీక జాగా। భావ పుండలీక జాగా॥

యాహో యాహో అవఘేజన। కరూ బాబాన్సీ వందన।
సాయీసీ వందన। కరూ బాబాన్సీ వందన॥

గణా హ్మ్రణే బాబాసాయీ। దావపావ మార్ఝె ఆఈ।
పావమార్ఝె ఆఈ। దావ పావ మార్ఝె ఆఈ॥

(తాత్పర్యము 38వ పేజీలో)

# 3 నమనము

కర్పూరము వెలిగించవలెను.

ఘాలీన లోటాంగణ వందీన చరణ
డోళ్యాని పాహీన రూప తుర్ఝె।
ప్రేమే ఆలింగన ఆనందే పూజిన్
భావే ఓవాళీన హ్మ్రణే నామా॥ 1

త్వమేవ మాతా పితా త్వమేవ।
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమదేవ దేవ॥ 2

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యా త్మ్రనావా ప్రకృతి స్వభావాత్।
కరోమి యద్యత్సకలం పరస్మై
నారాయణా యేతి సమర్పయామి॥ 3

అచ్యుతం కేశవం రామ నారాయణం
కృష్ణ దామోదరం వాసుదేవం హరిమ్।
శ్రీధరం మాధవం గోపికా వల్లభం
జానకీ నాయకం రామచంద్రం భజే॥

(తాత్పర్యము 39వ పేజీలో)

## 4 నామస్మరణ

(ఈ క్రింది నామము పాడుతూ నాలుగు సార్లు ప్రదక్షణ చేయవలెను.)

హరే రామ హరే రామ రామ రామ హరే హరే।
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే।

హరిః ఓం గురుదేవదత్త.

## 5 నమస్కారాష్టకం

అనంతా తులాతే కసేరే స్తవావే।
అనంతా తులాతే కసేరే నమావే।
అనంతా ముఖాచా శిణే శేషగాతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 1

స్మరావే మనీ త్వత్పదా నిత్యభావే।
ఉరావేతరీ భక్తి సాఠీ స్వభావే।
తరావే జగా తారునీ మాయతాతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 2

వసే జో సదా దావయా సంతలీలా।
దిసే ఆజ్ఞలోకా పరీ జో జనాలా।
పరీ అంతరీ జ్ఞాన కైవల్యదాతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 3

ధరా లాధలా జన్మ హా మానవాచా।
నరా సార్థకా సాధనీభూత సాచా।
ధరూ సాయి ప్రేమా గళాయా అహంతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 4

ధరావే కరీసాన అల్పాజ్ఞబాలా।
కరావే అహ్మా ధన్యచుంబోనిగాలా।
ముఖీ ఘాల ప్రేమే ఖరాగ్రాస అతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 5

సురాదీక జాంచ్యా పదా వంది తాతీ।
శుకాదీక జాంతే సమానత్వ దేతీ!
ప్రయాగాది తీర్థే పదీ నమ్ర హోతా।
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 6

తుఝ్యా జ్యాపదా పాహతా గోపబాలీ।
సదా రంగలీ చిత్స్వరూపీ మిళాలీ।
కరీ రాసక్రీడా సవే కృష్ణనాథా
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 7

తులా మాగతో మాగణే ఏక ధ్యావే।
కరా జోడితో దీన అత్యంత భావే।
భవీ మోహనీరాజ హా తారి ఆతా!
నమస్కార సాష్టాంగ శ్రీ సాయినాథా॥ 8

(తాత్పర్యము 43వ పేజీలో)

# 6 ప్రార్థన

ఐసాయేఈబా। సాయి దిగంబరా।
అక్షయరూప అవతారా। సర్వహివ్యాపకతూ।
శృతిసారా। అనసూయాత్రికుమారా। మహారాజే ఈబా।1

కాశీస్నాన జప ప్రతిదివశీ। కోల్హాపురభిక్షేసీ।
నిర్మల నదితుంగా। జలప్రాశీ। నిద్రామాహురదేశీ।
ఐసాయే ఈబా। 2

ఝోళిలోంబతసే వామకరీ। త్రిశూల ఢమరూధారీ।
భక్తావరద సదా సుఖకారీ। దేశిల ముక్తీచారీ।
ఐసాయే ఈబా। 3

పాయి పాదుకా జపమాలా। కమండలూమృగ ఛాలా।
ధారణ కరశీబా। నాగజటా ముగుటశోభతో మాథా।
ఐసాయే ఈబా॥ 4

తత్పర తుఝ్యాయా జేధ్యానీ। అక్షయత్యాంచేసదనీ।
లక్ష్మీవాసకరీ దిన రజనీ। రక్షసి సంకట వారుని।
ఐసాయే ఈబా। 5

యాపరిధ్యాన తుఝే। గురు రాయా। దృశ్యకరీ
నయనాయా।
పూర్ణానంద సుఖేహీకాయా। లావిసి హరిగుణగాయా॥
ఐసాయేఈబా। సాయి దిగంబరా। అక్షయరూప
అవతారా।

సర్వహి వ్యాపకతూ! శృతిసారా! అనసూయాత్రి కుమారా!
మహరాజే ఈబా॥ 6

(తాత్పర్యము 46వ పేజీలో)

# 7. శ్రీసాయినాథ మహిమ్నస్తోత్రము

సదా సత్స్వరూపం చిదానంద కందం।
జగత్సంభవస్థాన సంహారహేతుమ్।
స్వభక్తేచ్ఛయా మానుషం దర్శయంతం।
నమామీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 1

భవధ్వాంత విధ్వంస మార్తాండ మీడ్యం।
మనో వాగ తీతం మునిర్ ధ్యాన గమ్యమ్॥
జగద్వ్యాపకం నిర్మలం నిర్గుణత్వాం।
నమా మీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 2

భవాం బోధి మగ్నార్ధి తానాం జనానాం।
స్వపాదాశ్రితానాం స్వభక్తి ప్రియాణాం।
సముద్ధారణార్థం కలౌ సంభవంతం।
నమామీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 3

సదానింబ వృక్షస్య మూలాధి వాసాత్।
సుధా స్రావిణం తిక్తమప్య ప్రియంతం।
తరుం కల్ప వృక్షాధికం సాధయంతం।
నమా మీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 4

సదా కల్ప వృక్షస్య తస్యాధి మూలే।
భవ ద్భావ బుద్ధ్యా సపర్యాది సేవామ్।
నృణాం కుర్వ్వతాం భుక్తి ముక్తి ప్రదంతం।
నమా మీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 5

అనేకా శృతా తర్క్య లీలా విలాసై।
సమా విష్కృతేశాన భాస్వత్ప్ర భావమ్।
అహం భావ హీనం ప్రసన్నాత్మ భావమ్
నమా మీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 6

సతాం విశ్రమారామ మేవాభి రామం।
సదా సజ్జనై స్సం స్తుతం సన్నమద్భిః।
జనా మోదదం భక్త భద్ర ప్రదంతం।
నమామీశ్వరం సద్గురుం సాయినాథమ్॥ 7

అజన్మాద్య మేకం పరంబ్రహ్మ సాక్షాత్।
స్వయం సంభవం రామమే వావ తీర్ణమ్।
భవద్దర్శ నాత్సం పునీతః ప్రభో ఽ హం।
నమామీశ్వారం సద్గురుం సాయినాథమ్॥ 8

శ్రీ సాయీశ కృపానిధేఽ ఖిల నృణాం సర్వార్థసిద్ధి ప్రద।
యుష్మత్పాద రజః ప్రభావ మతులం ధాతాపి వక్తాఽ
క్షమః।
సద్భక్త్యై శరణం కృతాంజలి పుట సంప్రాపి తో ఽ
స్మి ప్రభో।
శ్రీమత్సాయి పరేశ పాద కమలాన్ నాన్యచ్ఛరణ్యం
మమ॥ 9

సాయి రూప ధర రాఘవోత్తమం।
భక్త కామ విభుధ ద్రుమం ప్రభుమ్।
మాయ యోప హత చిత్త శుద్ధయే।
చింత యామ్యహ మహర్నిశం ముదా॥ 10

శరత్సు ధాంశు ప్రతిమం ప్రకాశం।
కృపాత పత్రిం తవసాయినాథ।
త్వదీయ పాదాబ్జ సమాశ్రితానాం।
స్వచ్ఛాయయా తాప మపా కరోతు॥ 11

ఉపసనా దైవత సాయినాథ।
స్తవైర్మయో పాసని నాస్తుతస్త్వమ్।
రమేన్మనోమే తవపాద యుగ్మే।
భృంగో యథాబ్జే మకరంద లుబ్ధః॥ 12

అనేక జన్మార్జిత పాప సంక్షయో।
భవేద్భవత్పాద సరోజ దర్శనాత్।
క్షమస్య సర్వా నపరాధ పుంజకాన్।
ప్రసీద సాయీశ సద్గురో దయానిధే॥ 13

శ్రీ సాయినాథ చరణా మృత పూత చిత్తా।
స్త్వత్పాద సేవ నరతా స్సతతంచ భక్త్యా।
సంసార జన్య దురితౌ ఘ వినిర్గతాస్తే।
కైవల్యధామ పరమం సమవాప్నువంతి॥ 14

స్తోత్రమే తత్పఠే ద్భక్త్యా యో నరస్తన్మనా సదా।
సద్గురో సాయినాథస్య కృపాపాత్రం భవే ద్ధృవం॥ 15

(తాత్పర్యము 48వ పేజిలో)

# 8. శ్రీగురు ప్రసాద యాచనా దశకము

రుసో మమ ప్రియాంబికా, మజవరీ పితాహీరుసో।
రుసో మమ ప్రియాంగనా, ప్రియ సుతాత్మజాహీరుసో।
రుసో భగిని బంధుహీ, శ్వశుర సాసుబాయి రుసో।
నదత్త గురు సాయిమా, మజవరీ కధీహీరుసో॥ 1

తా॥ నా తల్లి-దండ్రులు అలిగినను, నా భార్యా-పిల్లలు అలిగినను, నా సోదరి-బంధువులు, అత్త మామలు అలిగినను దత్త గురువైన ఓ సాయినాథా! నీవు మాత్రము నాపై అలుగవద్దు.

పుసోన సున బాయిత్యా, మజన భాతృ జాయా పుసో।
పుసోన ప్రియ సోయరే, ప్రియ సగేన జ్ఞాతీ పుసో।
పుసో సుహృదనా సఖా. స్వజన నాప్త బంధూ పుసో।
పరీన గురు సాయిమా, మజవరీ కదీహీ రుసో॥ 2

తా.। నా గురించి నా కోడలు-వదిన ఆలోచించకపోనీ। ప్రయబాంధవులు-ప్రియ స్వజనులు ఆలోచించక పోనీ, సుఖులు, మిత్రులు, ఆప్తులు వీరెవరైనా ఆలోచించకపోనీ. గురువైన ఓ! సాయినాథా! నీవు మాత్రము నాపై అలుగక పట్టించుకో.

పుసోన అబలాములే, తరుణ వృద్ధహీనా పుసో।
పుసోన గురుధాకుటే, మజన థోర సానే పుసో।
పుసోన చ భలే బురే, సుజన సాధు హీనా పుసో।
పరీన గురు సాయి మా, మజవరీ కధీహీ రుసో॥ 3

తా॥ నా గురించి స్త్రీలు-బాలకులు, యవ్వనులు-వృద్ధులు ఆలోచించకపోనీ, మంచివారు-చెడ్డవారు, సజ్జనులు-సాధువులు ఆలోచించకపోనీ, గురువైన ఓ! సాయినాథా! నీవు మాత్రం నాపై అలుగక పట్టించుకో.

రుసో చతుర తత్త్వవిత్, విభుధ ప్రాజ్ఞ జ్ఞానీ రుసో।
రుసోహి విదుషీ స్త్రియా, కుశల పండితాహీ రుసో।
రుసో మహిపతీ యతీ, భజక తాపసీహీ రుసో।
నదత్తగురు సాయిమా, మజవరీ కధీహీ రుసో॥ 4

తా॥ నాపై చతుర తత్త్వ వేత్తలు-పండితులు, ప్రాజ్ఞులు-జ్ఞానులు, అలిగినను, విదుషీ మణులు-కుశలురైన పండితులు అలిగినను, రాజులు-సన్యాసులు, భక్తులు-తాపసులు ఎవరైనను అలిగినను దత్తగురు ఓ సాయినానాథా! నీవు మాత్రము అలుగవద్దు.

రుసోకవి ఋషీ మునీ, అనఘ సిద్ధయోగీ రుసో।
రుసోహి గృహదేవతా, నికుల గ్రామ దేవీ రుసో।
రుసోఖల పిశాచ్ఛహీ మలిన ఢాకినీ హీ రుసో।
న దత్తగురు సాయిమా, మజవరీ కధీ హీ రుసో॥ 5

తా॥ నా పై కవులు - ఋషులు, మునులు, గొప్ప నిష్పాపులు-సిద్ధయోగులు అలిగినను, గృహదేవతలు కులదేవతలు, గ్రామ దేవతలు అలిగినను, పిశాచములు-క్షుద్ర ఢాకినులు అలిగినను, దత్తగురు ఓ సాయినాథా! నీవు మాత్రము అలుగవద్దు.

రుసోమృగ ఖగ కృమీ, అఖిల జీవ జంతూరుసో।
రుసో విటప ప్రస్తరా, అచల ఆపగాబ్ధీరుసో।
రుసోఖ పవనాగ్నివార్, అవని పంచతత్త్వే రుసో।
నదత్తగురు సాయిమా, మజవరీ కధీహీ రుసో॥ 6

తా॥ నాపై మృగములు, పక్షులు, క్రిమికీటకాది జీవ జంతవులన్ని అలిగినను, చెట్లు, రాళ్ళు, కొండలు, నదులు, సముద్రములు అలిగినను, ఆకాశము - వాయువు, అగ్ని - నీరు, భూమి అయిన పంచ భూతములు అలిగినను, దత్తగురు ఓ యియినాథా। నీవు మాత్రము అలుగకుము.

రుసో విమల కిన్నరా, అమల యక్షిణీహీ రుసో।
రుసో శశి ఖగాదిహీ, గగని తారకాహీ రుసో।
రుసో అమర రాజహీ, అదయ ధర్మరాజా రుసో।
న దత్తగురు సాయిమా, మజ వరీ కధీహీ రుసో॥ 7

తా॥ నాపై శిద్ధులైన కిన్నరులు - యక్షులు అలిగినను, సూర్య - చంద్రులు, నక్షత్రములు అలిగినను, అమరేంద్రుడు - యమధర్మరాజు అలిగిననూ, దత్తగురు ఓ సాయినాథా। నీవు మాత్రము అలుగకుము.

రుసోమన సరస్వతీ, చపల చిత్త తేహీ రుసో।
రుసో వపు దిశాఖిలా, కఠిన కాలతోహీ రుసో।
రుసో సకల విశ్వహీ, మయితు బ్రహ్మ గోలం రుసో।
న దత్త గురుసాయిమా, మజ వరీ కధీహీ రుసో॥ 8

తా॥ నాపై మనసు వాక్కు (సరస్వతి), చపల చిత్తము (లక్ష్మి), శరీరము అలిగినను, సమస్త దిక్కులు, కఠినమైన కాలము అలిగినను, ప్రపంచమంతయు, భూగోళమంతయు అలిగిననూ, దత్తగురు ఓ సాయినాథా। నీవు మాత్రము అలుగకుము.

విమూఢ హ్మణునీ హసో, మజన మత్సరాహీ ఢసో।
పదాభి రుచి ఉల్హాసో, జనన కర్ద మీనా ఫసో।
నదుర్గ ధృతిచాధసో, అశివ భావమాగే ఖసో।
ప్రపంచి మనహేరుసో, ద్రుఢ విరక్తి చిత్తీ ఠసో॥ 9

తా॥ మూర్ఖుడనని నవ్విననూ, మత్సరమనే సర్పము కాటు వేసినను, గురుపదములయందు నాకుఎల్లప్పుడు ప్రీతియుండుగాక. జన్మ సంబంధమైన బురదలో చిక్కకుండుగాక. ధైర్యమును విడువకుండుగాక. అశుభమైన ఆలోచనలు కలుగకుండుగాక. ప్రపంచ మునందు మనస్సు లగ్నముకాక ధృఢవిరక్తిచిత్తము నొందుగాక.

కుణాచి హీ ఘృణానసో, నచ స్పృహాకశాచీ అసో।
సదైవ హృదయీ వసో, మనసి ధ్యాని సాయి వసో।
పదీ ప్రణయ వో రసో, నిఖిల దృశ్య బాబా దిసో।
న దత్తగురు సాయిమా, ఉపరి యాచనేలా రుసో॥ 10

తా॥ యవరియందు ద్వేషముండక, దేనియందు కోరిక యుండక, ఎల్లప్పుడు నా హృదయము నందు

సాయినాథుని ధ్యానము జరుగుగాక. గురుపదము
యందు ప్రేమ యుండుగాక. ఈ ప్రపంచమంతా
సాయిరూపముగా దర్శించుగాక. దత్తగురు ఓ సాయి
మాతా। నీవు నాపై అలుగకుండా భిక్ష పెట్టి
అనుగ్రహించుము.

## 9 మంత్రపుష్పము

హరిః ఓమ్ యజ్ఞేన యజ్ఞమయ జన్త దేవాస్తాని
ధర్మాణి ప్రథమాన్యాసన్।
తేహ నాకం మహిమానస్స చన్త యత్ర పూర్వే
సాధ్యాస్సంతి దేవాః

ఓమ్ రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే
నమో వయం వై శ్రవణాయ కుర్మహే
సమే కామాన్ కామ కామాయ మహ్యం
కామేశ్వరో వై శ్రవణో దధాతు
కుబేరాయ వై శ్రవణాయ
మహారాజాయనమః

ఓమ్ స్వస్తి సామ్రాజ్యం భోజ్యం
స్వారాజ్యం వై రాజ్యం పారమేష్ఠ్యం రాజ్యం
మహారాజ్యమాధి పత్యమయం సముద్ర
పర్యన్తాయా ఏక రాడితి.

ఈశ స్సార్వభౌమ స్సా ర్వాయుష అం దాతా
పరార్థాత్ పృథివ్యా సముద్ర పర్యన్తాయా ఏక రాడితి
త దప్యేష శ్లోకోభిగీతం మరుతః
పరి వేష్టారో మరుతస్త స్యా వసన్గృహే
అవిక్షి తస్య కామస్య పరివేష్టారో
విశ్వేదేవాస్సభా సద ఇతి.

శ్రీ నారాయణ వాసుదేవ సచ్చిదానంద సద్గురు
సాయినాథ్ మహారాజ్‌కి జై

(తాత్పర్యము 41వ పేజీలో)

## 10 ప్రార్థన

కరచరణ కృతం వాక్కాయజం కర్మజంవా
శ్రవణ నయనజం వా మానసం వాఽ పరాధమ్।
విదిత మవిదితం వా సర్వమేతత్ క్షమస్వ
జయ జయ కరుణాబ్దే శ్రీప్రభో సాయినాథ॥
శ్రీ సచ్చిదానంద సద్గురు సాయినాథ్ మహారాజ్‌కి జై

రాజాధి రాజ యోగిరాజ పరబ్రహ్మ
శ్రీ సాయినాథ్ మహారాజ్.

శ్రీ సచ్చిదానంద సద్గురు సాయినాథ్ మహారాజ్‌కి జై

సాయం సంధ్య ఆరతి సమాప్తం.



# శేజహారతి

ధూప, దీప నైవేద్యానంతరము సరిగా రాత్రి గం. 10-00 లకు ఐదు వత్తులతో హారతి యివ్వాలి. గోధుమ రొట్టె నైవేద్యముగా ఇవ్వాలి. వింజామరలతో బాబాకు విసరుతు ఉండాలి.

## 1 ఆరతి

ఓవాళూ ఆరతీ మాఝ్యా సద్గురు నాథా।
మాఝూ సాయినాథా।

పాన్ చాహీ తత్త్వాంచా దీప-లావిలా ఆతా॥ 1

తా॥ ఓ సద్గురు సాయినాథా। నీకు ఆరతి. పంచతత్త్వాలకు సంకేతముగా ఐదు వత్తులను వెలిగించి ఆరతి త్రిప్పుతాను.

నిరాకారాచీస్థితీ కైసీ - ఆకారా ఆలీ।
బాబా ఆకారా ఆలీ।
సర్వాఘటిభరూని ఉరలీ సాయిమా ఉలీ॥
॥ ఓవాళూ ॥ 2

తా॥ నిరాకార స్థితుడవైన నీవు ఆకారమును ఎట్లు ధరించితివి? ఈ విశ్వమంతా వ్యాపించియున్న నీవు యింకనూ సాయితల్లిగా మిగిలియున్నావు.
ఓ సద్గురు సాయినాథా। నీకు ఆరతి.

రజతమసత్త్వతిఘే మాయా ప్రసవలీ।
బాబా మాయా ప్రసవలీ।
మాయేచియ పోటీకైసీ - మాయా ఉద్భవలీ॥
॥ ఓవాళూ ॥ 3

తా॥ రాజస, తామస, సాత్వతిక గుణముల నుండి మాయ ఉద్భవించినది. ఆ మాయయొక్క పొట్ట నుండి మరలా వేరొక మాయ ఎలా ఉద్భవించును? ఓ సద్గురు సాయినాథా। నీకు అరతి.

సప్తసాగరీ కైసా ఖేళ్ మాండీలా।
బాబా ఖేళ్ మాండీలా।
ఖేళూనియా ఖేళ్ అవఘా విస్తారకేలా॥
॥ ఓవాళూ ॥ 4

తా॥ సప్తసముద్రములను [ప్రపంచమును] నీవు ఆట స్థలముగా ఎలా చేస్తున్నావు? అలాఆటలు ఆడుతూనే (మాజీ వితములతో) సంపూర్ణముగా విస్తరింపజేస్తూ ఉన్నావు.

బ్రహ్మాండీ చీ రచనా కైసీ దాఖవలీ డోళా।
బాబా దాఖవలీ డోళా।
తు కాహ్మకే మాఝూ స్వామీ కృపాళూ భోళా॥
॥ ఓవాళూ ॥ 5

తా॥ ఈ బ్రహ్మాడముయొక్క (ఈ ప్రపంచ సృష్టి) రచన ఏ విధముగా మాకు కనుపింపజేసితివి. నాస్వామి,

దయామయుడు. మఱియు బోళాతనముగలవాడని తుకారాము కీర్తించుచున్నాడు. ఓ సద్గురు సాయినాథా। నీకు ఆరతి.

## 2 ఆరతి జ్ఞాన రాయచీ

లోపలే జ్ఞాన జగీ। హిత నేణతీ కోణీ।
అవతార పాండురంగా। నామరేవిలే జ్ఞానీ॥ 1

తా॥ ఈ జగత్తునందు జ్ఞానము లోపించినది. తమకు ఏది హితమో తెలుసుకొనలేకపోతున్నారు. జ్ఞానులంతా పాండురంగని అవతారమైన విఠలుడవని అంటున్నారు

ఆరతి జ్ఞాన రాజా। మహా కైవల్య తేజా।
సేవితీ సాధుసంతా। మను వేధలా మాఝా॥
ఆరతి జ్ఞాన రాజా॥ 2

తా॥ ఓ జ్ఞాన రాజా। నీకు ఆరతి. ఓ మహా కైవల్యతేజా। సాధువులు-సంతులు కూడ నిన్ను సేవించుచూ, మనస్సు నీపై లగ్నము చేయుచున్నారు.

కనకాచేతాటకారీ। ఉభ్యా గోపికానారీ।
నారద తుంబరహో। సామగాయన కరీ॥ ॥ఆ.జ్ఞా॥ 3

తా॥ గోపికా స్త్రీలు బంగారపు పళ్ళెములలో ఆరతి పట్టుకుని నిలచినారు. నారద-తుంబురులు కూడ సామగానము చేయుచున్నారు. ఓ జ్ఞానరాజా। నీకు అరతి

ప్రగట గుహ్యాబోలే। విశ్వబ్రహ్మాచి కేలే।
రామ జనార్దనీ। పాయి మస్తకఠేవిలే॥ ॥ఆ.జ్ఞా॥ 4

తా॥ అతిరహస్యమైన బ్రహ్మస్వరూపతత్త్వాన్ని
ఈ ప్రపంచమునకు తెలియపరచినావు. ఓ రామ
జనార్ధనస్వామీ। నా శిరస్సును నీ పాదములపైవుంచి
నమస్కరించుచున్నాను. ఓ జ్ఞానరాజా। నీకు ఆరతి

## 3 ఆరతి తుకారామచీ

ఆరతి తుకారామా। స్వామీ సద్గురు ధామా।
సచ్చిదానంద మూర్తి। పాయ దాఖవీ అహ్మా।
ఆరతి తుకారామా॥ 1

తా॥ తుకారామా నీకు ఆరతి। సద్గురుధామ,
సచ్చిదానందరూపా। ఓ స్వామీ। నీ చరణ
దర్శనమునిమ్ము.

రాఘవే సాగరాతా। జైసే పాషాణ తారిలే।
తైసే హేతుకోబాచే। అభంగ రక్షిలే॥ ॥ఆ.తు॥ 2

తా॥ శ్రీరాముని మహిమవలన సముద్రముపై వారధి
నిర్మించుటకు నీటిలో వేసిన రాళ్ళు ఏలా నిలిచాయో
అదే విధముగా తుకారాముని అభంగములను
నీ మహిమచే రక్షించినావు.

తూకితా తులనేసీ। బ్రహ్మాతుకాసి ఆలే।
హ్మాణోనీ రామేశ్వరే చరణీ మస్తకఠేవితే॥

॥ ఆ. తు ॥ 3

తా॥ ఆయన మహిమలను తూచగా అతడు సాక్షాతు బ్రహ్మస్వరూపుడని తెలిసినది. అందువలన రామేశ్వరుడుకూడా, అతని పాదములయందు నమస్కరించుచున్నాడు.

## 4 శేజ హారతి

జైజై సాయినాథ ఆతా-పహుడావే మందిరీహో

॥ జైజై ॥

ఆళవితో సప్రేమే తుజలా-ఆరతి ఘేవునికరీహో
జైజై సాయినాథ ఆతా-పహుడావే మందిరీహో॥

తా॥ ఓ సాయినాథా। జయము, జయము. ఇక నీ మందిరములో నిదురపోవయ్యా.

రంజవిసీ తూ మధురబోలునీ -
మాయ జశీ నిజములాహో ॥రం॥
భోగిసి వ్యాధీ తూచ హరునియా -
నిజ సేవకదుఃఖా లాహో ॥భో॥
ధావుని భక్తవ్యసన హరీసీ -
దర్శన దేసి త్యాలాహో ॥ధా॥
ఝాలే అసతిల కష్ట అతీశయ -
తుమచేయా దేహాలహో ॥జైజై॥ 1

తా॥ తల్లి మధురమైన మాటలతో తన పిల్లవానిని బుజ్జగించినట్లు నీవు మమ్మల్ని నీ మాయలో పడవేస్తావు. నిన్ను సేవించే నీ సేవకుల రోగాలను హరించి, వారిదుఃఖములను నీవు అనుభవిస్తావు ఈ కష్టాల అతిశయమంతా మీదేహానకి సంభందించినదే ఓ సాయినాథా జయము, జయము ఇహ నీ మందిరములో నిదురపోవయ్యా.

క్షమా శయన సుందరహీ శోభా
సుమన శేజ త్యావరీ హెూ ॥ క్ష ॥
ఘావీ థోడీ భక్త జనాంచీ
పూజా అర్చా కరీ హెూ ॥ ఘా ॥
ఓ వాళీతో పంచప్రాణజ్యోతి ఘుమతీ కరీ హెూ ॥ఓ॥
సేవా కింకర భక్త ప్రీతి
అత్తర పరిమళవారి హెూ ॥ జై జై ॥

తా॥ క్షమయనే శయ్యపై, సుందరమైన శోభతో పూల పాన్పు వేశాను. భక్తజనులంతా పూజా-అర్చనలు చేస్తున్నారు. పంచప్రాణాలనే జ్యోతితో హారతి యిస్తున్నారు. నీ కింకరుల భక్తియే పన్నీరుగా అర్పిస్తున్నారు. వాటిని స్వీకరించు. ఓ సాయినాథా! నీకు జయము, జయము. ఇహ నీ మందిరములో నిదురపోవయ్యా.

సోడుని జాయా దుఃఖ వాటతే
సాయి తవచరణాసీ హెూ ॥సో॥

ఆజ్ఞేస్త్వహా ఆశీర్ప్రసాద
ఘేవుని నిజసదనాసీ హెూ ॥ఆ ॥
జాతో ఆతా యేవు పునరపి -
తవచరణాంచే పాసీ హెూ ॥జా ॥
ఉఠవూ తుజలా సాయిమాఉలే -
నిజహిత సాథా యాసి హెూ ॥జై జై॥

తా॥ ఓ సాయినాథా! నీ పాదపద్మములను విడచి వెళ్ళుటకు నాకు దుఃఖము కలుగుచున్నది. ఇప్పుడు తమ ఆజ్ఞతో నీ ప్రసాదము తీసికొని యింటికి వెళతాము. ఇప్పుడు వెళ్ళినా రేపు మరలా నీ పాదముల దగ్గరకు చేరుతాము. ఉదయమే నిన్ను మేలుకొలిపి మా మేలును పొందుతాము. ఓ సాయినాథా! నీకు జయము, జయము. ఇహ నీ మందిరములో నిదురపోవయ్యా.

## 5 శేజారతీ

అతా స్వామీ సుఖేనిద్రాకరా అవధూతా।
బాబా కరా సాయినాథా।
చిన్మయనిజ సుఖధామజాఉని
పహుడా ఏకాంతా॥ ॥ ఆతా ॥

తా॥ స్వామీ అవధూతా! సుఖముగా నిద్రపొండి. బాబా సాయినాథా! సుఖముగా నిద్రపోవయ్యా। చిన్మయానందములో మునిగి నీ నిజధామములో ఏకాంతముగా శయనించు.

వైరాగ్యా చా కుంచ ఘేఉనిచౌక ఝాడిలా।
బాబా చౌక ఝాడిలా।
తయావరీ సుప్రేమాచా శిడకావా దిధలా ॥అతా॥ 1

తా॥ బాబా। వైరాగ్య భావమనే చీపురుతో నీ శయన మందిరము చిమ్మినాము. నీ పైన ప్రేమయనే కరుణాజలమును చల్లినాము. సుఖముగా నిద్రించుము

పాయ ఘడ్యా ఘాతల్యా సుందర నవవిథా భక్తి।
బాబా నవవిధ భక్తి।
జ్ఞానాంచ్యా సమయా లావుని ఉజళల్యా జ్యోతీ॥
॥అతా॥ 2

తా॥ రత్నాలతో చేసిన సుందరమైన మంచము పైకి ఎక్కడానికి నవవిధ భక్తియనే మెట్లను ఏర్పాటు చేశాను బాబా. ప్రక్కనే జ్ఞానమైన జ్యోతిని వెలిగించాను. సుఖముగా నిద్రించుము.

భావార్థాచా మంచక హృదయా కాశీ టాంగిలా।
బాబా కాశీటాంగిలా।
మనాచీ సుమనే కరునీ కేలే బాబా శేజేలా॥ ॥అతా॥ 3

తా॥ భక్తియనే మంచము పైన, మనస్సుయనే పూలపాన్పువేసి సిద్ధము చేశాను. బాబా ఇప్పుడు నీవు ఆనందముగా నిద్రించుము.

ద్వైతాచే కపాట లావుని ఏకత్రకేలే।
బాబా ఏకత్రకేలే।

దుర్బుద్ధించా గాంఠీ సోఢుని పడదే సోడిలే॥
॥అతా॥ 4

తా॥ ద్వైతమనే తలపులువేసి ఒకటిగా చేసితిని. బాబా।
దుర్బుద్ధులనే ముడివిప్పి తెరనువేసితిని. ఇప్పుడు
సుఖముగా నిద్రించుము.

ఆశా తష్టా కల్పానేఛా సోడునిగల బలా।
బాబా సోఢునిగల బలా।
దయా క్షమా శాంతి దాసీ ఉభ్యా సేవేలా॥
॥అతా॥ 5

తా॥ ఆశ-తృష్ణ అనే కల్పనలను విడచి, దయ-క్షమ-
శాంతి అనే దాసులు సేవచేయుటకు నీ దగ్గర
వేచియున్నవి. నీవు సుఖముగా నిద్రించుము.

అలక్ష్య ఉన్మని ఘేఃని నాజుకదుఃశాల।
బాబా నాజుకదుఃశాల
నిరంజని సద్గురు స్వామీ నిజవీతే శేజే లా? ॥అతా॥ 6

తా॥ అలక్ష్యమనే సుఖము, శాలువాగామార్చి నిరంజనుడ
పైన నీపై కప్పుతాను బాబా. ఓ. సద్గురు స్వామి
ప్రక్కమీద శయనించండి.

సద్గురు సాయినాథ్ మహారాజ్‌కి జై

గురు దేవ దత్త

## 6 అభంగము

[ప్రసాదమును గైకొనుట]

పాహే ప్రసాదా చీవాట। ద్యావేధువోని యాతాట।
శేషఘేఉని జాఈల। తుమచే ఝూలియా భోజన॥

తా॥ ఓ సాయినాథా! మీరు భోజనమును పూర్తిచేసితిరి. మీ భోజన ఉచ్ఛిష్టమును స్వీకరించెదము.

ఝూలో అతాఏక సవా। తుహ్మా
ఆడును యాదేవా ॥ శే ॥
తుకాహ్మణే అతా చిత్తా కరునీ
రాహిలోనిశ్చిత్ ॥ శే ॥

తా॥ మా పళ్ళెములను సుభ్రపరచుకుని మీ ప్రసాదమునకై వేచియున్నాము. మేమంతా నీ ధ్యానములో మునిగి మా చంచలచిత్తమును నిశ్చలభక్తితో స్థిరపరచుకుంటున్నాము.

## 7 పదము

పావలా ప్రసాద అతా విఠోనిజావే।
బాబా అఠోని జావే।
అపులాతో శ్రమకళోయేతేసేభావే॥

తా॥ విఠలా! నీ ప్రసాదము లభించినది. విచారించగా నీవు మా కొఅకు ఎంత కష్టపడుచున్నావో తెలిసినది

అతాస్వామీ సుఖే నిద్రాకరా గోపాళా।
బాబా సాయిదయాళ।

పురలే మనోరథజాతో అపుల్యాస్థళా॥

తా॥ స్వామీ గోపాళా! సుఖముగా నిద్రించుము. మా మనోభీష్టములు నెరవేరినవి. మా స్థలములకు వెళ్ళుచున్నాము.

తుహ్మాసీ జాగవూ అహ్మా అపుల్యాచాడా।
బాబా అపుల్యాచాడా।
శుభా శుభకర్మే దోషహరావయాపీడ॥ ॥అతా॥

తా॥ మా కష్టములను తెలుపుటకై మరలావచ్చి నిన్ను లేపెదము. శుభము-అశుభములకర్మల, దోషపీడల పరిహారము గావించుకొందుము. స్వామీ గోపాళా। సుఖముగా నిద్రించుము.

తుకాహ్మాణె దిధలే ఉచ్ఛిష్టాచే భోజన।
ఉచ్ఛిష్టాచే భోజన।
నాహినివడిలే అహ్మా అపుల్యాభిన్న॥ ॥అతా॥

తా॥ నీవు-మేము వేరుకాదని, నీవుమాతో ఒకనిగా భావించి, నీ ఉచ్ఛిష్ట భోజనమును ప్రసాదముగా స్వీకరించినాము. స్వామీ గోపాళా! సుఖముగా నిద్రించుము.

సద్గురు సాయినాథ్ మహారాజ్‌కీ జై
రాజాధి రాజయోగిరాజ పరబ్రహ్మ
శ్రీ సాయినాథ మహారాజ్
శ్రీ సచ్చిదానంద సద్గురు సాయినాథ్ మహారాజ్‌కీ జై
శేజహారతి(పవళింపు హారతి) కార్యక్రమము సమాప్తము

# శ్రీ సాయినాథ మంగళ హారతి

1 స్వామి సాయినాథాయ। షిరిడీక్షేత్రవాసాయ।
మామకాభీష్టదాయ। మహిత మంగళం॥

2 లోకనాథాయ। భక్తలోక సంరక్షకాయ। ॥లోక॥
నాగలోక స్తుత్యాయ। నవ్య మంగళం॥ ॥స్వామి॥

3 భక్తబృందవందితాయ। బ్రహ్మస్వరూపాయ। ॥భక్త॥
ముక్తిమార్గ బోధకాయ। పూజ్య మంగళం॥ ॥స్వామి॥

4 సత్యతత్త్వ బోధకాయ। సాధువేషాయతే। ॥సత్య॥
నిత్యమంగళదాయకాయ। నిత్య మంగళం॥ ॥స్వామి॥

జయ జయ గురుదేవ-స్వామి జయ జయ గురుదేవా।
బ్రహ్మవిష్ణు పరమేశ్వర రూపా-ఆనందా నిలయా।
ఓం జయ జయ గురుదేవా॥

లోపలనీవే - వెలుపలనీవే - అంతయునీవేలే।
జగమంతయు నీవేలే॥ ॥జయ జయ॥

అండ పిండ బ్రహ్మాండములోన-ఉన్నది నీవేలే॥
నిండి వున్నది నీవేలే॥ ॥జయ జయ॥

వేదమునీవే - నాదమునీవే - జ్ఞానము నీవేలే।
బ్రహ్మజ్ఞానము నీవేలే॥ ॥జయ జయ॥

అందరిలోన వెలుగుచునున్న - ఆత్మవు నీవేలే।
పరమాత్మవు నీవేలే॥ ॥జయ జయ॥

(3 సార్లు)

# శ్రీ సాయినాథుని ఏకాదశ సూత్రములు

1 షిరిడీ ప్రవేశమేసర్వదుఃఖ పరిహారము.
2 ఆర్తులైననేమి, నిరుపేదలైననేమి, ద్వారకామాయి ప్రవేశించినంతనే సుఖ సంపద లందగలరు.
3 ఈ భౌతిక దేహానంతరముసైతము నేను అప్రమత్తుడనే.
4 నా భక్తులరక్షణము నాసమాధినుండియే వెలువడును
5 సమాధినుండియే నేను సర్వకార్యములు నిర్వహింతును.
6 సమాధినుండి నా మానుష శరీరము మాట్లాడును.
7 నన్నాశ్రయించు వానిని, నన్ను శరణుజొచ్చిన వానిని, నిరంతరము రక్షించుటయే నాకర్తవ్యము
8 నాయందెవరి దృష్టి కలదో వారియందు నా కటాక్షము కలదు.
9 మీభారములు నాపై పడవేయుడు, నేనుమోసెదను
10 నా సహాయముగాని, సలహాగాని కోరిన తక్షణమే ఒసంగెదను.
11 నా భక్తుల గృహములయందు, లేమియను శబ్దము పొడచూపదు.

పరమం పవిత్రం - బాబా విభూదిం।
పరమం విచిత్రం - లీలా విభూదిం।
పరమార్థ యిష్టార్థ - మోక్షప్రదాతం।
బాబా విభూదిం - ఇదమాశ్రయామి॥ ॥పరమం॥
సాయిబాబా విభూదిం - ఇదమాశ్రయామి॥ (3 సార్లు)

## శ్రీ సాయి బాబా మందిరములో జరుగు కార్యక్రమములు

పొన్నూరు పట్టణములో ది 28-9-1986న సాయిభక్తులు ప్రథమముగా సమావేశమై శ్రీ షిరిడీ సాయిసేవా మండలి స్థాపించబడినది. 1992లో సాయినగర్‌లో శ్రీ ఆలపాటి చలపతిరావుగారు ఉచితముగా యిచ్చిన య. 0.05 సెంట్లస్థలములో అండర్‌గ్రౌండు ధ్యానమందిరము నిర్మించి, దానిపై బాబా మందిర నిర్మాణముచేసి ది. 22-5-1996వ తేదిన 5'-4"ల ఎత్తు గల శ్రీ షిరిడీసాయిబాబా అభయహస్త పాలరాతి విగ్రహము, విఘ్నేశ్వర, దత్తాత్రేయ విగ్రహములు, రెండు జతల సాయిపాదుకలు ప్రతిష్టించటమైనది. శాశ్విత ధునిని ప్రారంభించటమైనది.

**జరుగు కార్యక్రమములు:-** నాలుగు వేళల హారతులు,ఉదయం గం.6 లకు మంగళస్నానం, వివిధ పూజలు భక్తులు స్వయముగా పాల్గొనే విధముగా నిర్వహించబడుచున్నవి. ప్రతి గురువారము ధునిపూజ, ప్రత్యేక సత్సంగము నిర్వహించబడుచున్నవి. ఉగాది నుండి శ్రీ రామనవమి వరకు వసంత నవరాత్రులలో ప్రత్యేక అభిషేకములు, చందనోత్సవము, గురుపూర్ణిమ, కృష్ణాష్టమి, బాబా పుణ్యతిథిని నవరాత్రులలో ప్రత్యేక కార్యక్రమములతో నగరోత్సవము, దత్తజయంతి మిగిలిన పండుగలు నిర్వహింపబడుచున్నవి. పల్లకి సేవ ప్రారంభించబడుచున్నది.

**సాయితత్వప్రచారము:-** సత్సంగ భజనలు మందిరములోను, భక్తుల యిండ్లవద్ద నిర్వహించబడుచున్నవి. సాయితత్వ ఉపన్యాసములు, కవితాసమ్మేళనము, అష్టావధానము, సాయి విజయములాటి సాహిత్య

కార్యక్రమముల ద్వారాను, క్విజ్ పోటీలు, హారతి పాటల పోటీల ద్వారాను ప్రచారము జరుగుచున్నది. సత్సంగ పుస్తకములు, ఆరతుల పుస్తకములు, బాబా జీవిత సంగ్రహ పుస్తకములు ప్రింటు చేయించి భక్తులకు అందించబడుచున్నవి.

## సేవాకార్యక్రమములు

**1. శాశ్విత నిత్యాన్నదానము:-** 1989 ఉగాది నుండి శాశ్విత నిత్యాన్నదానము నిర్వహించ బడుచున్నది. ఫిక్సెడుడిపాజట్లపై వచ్చు వడ్డీతో బిక్షుకులకు , అనాధలకు, బీద విద్యార్థులకు అన్న దానము చేయబడుచున్నది.

**2. ఉచితవిద్య :-** ది 5-5-1994 నుండి శ్రీ షిరిడీ సాయి ఉచిత విద్యాలయము ప్రారంభించి 1 నుండి 5 తరగతుల 60 మంది బాలబాలికలకు, ముగ్గురు టీచర్లచే ఉచితముగా విద్య చెప్పబడుచున్నది. వీరికి ఉచితముగా దుస్తులు, పుస్తకములు యిచ్చుచూ వైద్యము కూడా చేయబడుచున్నది.

**3. ఉచిత వైద్యము:-** ది. 11-1-98న శ్రీ షిరిడీసాయి భక్త సేవా సమాజ్ గుంటూరు జిల్లా పొన్నూరు మండల సమాజ్‌తో సంయుక్తముగా శ్రీ షిరిడీ సాయి ఉచిత హోమియో వైద్యాలయము నిర్వహించబడుచున్నది.

4. యివియేకాక 200 మంది బీదలకు వస్త్రదానము, ప్రత్యేక కంటి, దంతవైద్యసేవలు అందించ బడుచున్నవి. అన్ని మతములకు హితముగా మానవ సేవయే మాధవసేవగా, అదే సాయి సేవాగా సాయినాధుడు ఈ మందిరమున నిర్వహింపజేయుచున్నారు.

ఇట్లు

**శ్రీ షిరిడీ సాయిసేవామండలి**

సాయినగర్- పొన్నూరు 522 124

# షిరిడీ-హారతులు

(తెలుగు లిపిలో, తాత్పర్యసహితము)

సంకలనము

**శ్రీ ఆలూరు గోపాలరావు**



ప్రచురణ

**శ్రీ షిరిడీసాయి సేవా మండలి**

రి.నెం 37/87

సాయి నగర్ - పొన్నూరు

గుంటూరు జిల్లా - పిన్ 522 124.

దగులఁగఁజేసి నాకుఁ బరితాపము హెచ్చఁగఁ జేసి నీవునుం
బొగిలిన నేమియో ! మఱచిపోయి సుఖమ్ముగ నుండు చిత్తమా. 53

ఉ. రాతిరి కొంత నిద్ర గదురంగనె దూరమునందు నున్న యా
నాతినిఁ జూడఁబోయి యట నాలుగుజాములు నుండి యిప్డుగా
చేతమ! వచ్చితీ; విటులఁ జేసిన నిన్నిఁక నేమి సేసినం
బాతక మున్నదే ! యిటుల భామల మాయలఁ జిక్కవచ్చునే ! 54

సీ. "స్త్రీలఁ గూడినఁ జేటు చేకూఱు" నని సదా
పలుకు నే నాబాలఁ గలయనేల ?
కలసిన నేమి, 'లోకులు విన్న మర్యాద
లకు భంగ' మని భీతిలంగ నేల ?
భీతిల్ల నేమి, యాభీతభీతమృగాక్షి
నట డించి యచ్చోటి కరుగనేల ?
అరిగిన నేమి, యాయంగన కొకనీటి
బొట్టు డించక యిట్లు పొక్కనేల ?
తే. గీ. గతజలమ్మున కీయానక ట్టదేల ?
యెట్టినేర్పులు గలిగిన దిట్టయైనఁ
బరులకును బుద్ధులను జెప్పవచ్చుఁ గాని
యాత్మకైనప్పు డాబుద్ధు లడుగువట్టు. 55

చ. కలిమి చెడంగనిమ్ము, కులకామినిదిట్టినఁ దిట్టనిమ్ము, విం
దలు గలుగంగనిమ్ము, తలిదండ్రులు గుందినఁ గుందనిమ్ము, సం
కెలలు పడంగనిమ్ము, తనకీర్తికి భంగము గల్గనిమ్ము, దాఁ
గలసినకాంతఁ బాయు టది కష్టము కష్టము కష్ట మక్కటా ! 56

ఉ. మారకళావిశేషముల మర్మములెల్లఁ బఠించి, లక్ష్యముల్
నేరుచు టెట్లొకో యనుచు నేను విచారణ సేయుచుండఁగా
నా రమణీలలామ తనయంతనె తాఁగరుణించి నేర్పఁగా
నేరిచినాఁడ; దాని విడనేర్తునె ? నేర్చిన దైవ మోర్చునే ! 57

క. అని యీగతి మోహాబ్ధిని
మునిఁగి మనోరథరథమ్ముఁ బూని యతఁడు వే
గ నిజావాసముఁ జేరెను
మనోరథము నిలుపఁదగిన మానిసి గలఁడే? 58

వ. అట్లు వచ్చినపిమ్మట.

ఉ. అక్కమలాక్షి యాతఁడును నగ్గలమై తనరారు పేర్మి పెం
పెక్కఁగఁ గొంతకాలము యథేష్టసుఖమ్ములఁ దేలుచుండఁగా
నొక్కెడ నత్తలోదరియు నొక్క యయోగ్యతఁ జేసెఁ; గంబళిన్
మెక్కుచు వెండ్రుకల్ వెదుక మేకొనుచోఁ గఱవానె యేరికిన్? 60

తే. గీ. రాజరాజైన నెంతటి రసికుఁడైన
నెంత గారా మొసంగిన నెంత ధన మొ
సంగినను జాటున నొనర్చు దొంగసంగ
తుల నొనర్పక మాన దీ తులువజాతి. 61

వ. ఇట్లిబ్బాల తన వృత్తిపైఖరిం బ్రవర్తింపుచుంటయు. 62

క. ఎఱుఁగక యాతం డెప్పటి
కరణిన్ వర్తింపుచుండెఁ గామవశుండై
ధర గణికాంగన లొనరుచు
దురుపాయము లేరికైన దుర్జ్ఞేయంబుల్. 63

వ. ఇట్లున్నంత.

క. అమ్మధుసూదను కష్ట సు
ఖమ్ములకు సమపాలిసక్తిగల గుణవంతుం
డమ్మగువదైన వృత్తాం
తమ్మంతయు నెఱిఁగి యిట్లు తలపోసె మదిన్. 65

తే. గీ. ఎన్నివిధములఁ జెప్పిన నితఁడు మున్ను
వినక తుద కాచరించె నవ్వెలఁది పొందు;
ఆచరించుట కేమి, 'యమ్మాతివ మిన్న
తన్న గుణవతి' లేదంచుఁ గళవళించు.

ఉ. 'అందమునందుఁ గాని మరియాదలపట్టునఁగాని నేమపుం
జందమునందుఁగాని వెలచానలలోనన కాదు, దీనికే
చందనగంధులున్ సవతు సల్పఁగ రా' రని యూరుచుండు; రో
సుందరులం దగుల్కొనిన సోమరులన్ మఱలింపశక్యమే ? 67

తే. గీ. అయిన నిద్దాని యవగుణం బతనితోడఁ
జెప్పి విడఁదీతుఁ గాక యచ్చెలియ పొందు;
పత్నితో భర్తనెడఁబాపఁ బాప మండ్రు
కాని వెలయాలి నెడఁబాపఁ గలుషమనరు. 68

వ. అని నిశ్చయించి యమ్మధుసూదనుకడ కేతెంచి తత్కాలసముచితాలాపమ్ములం గాలమ్ముగడపుచు నబ్బాల దుశ్శీలంబు సకృత్స్నంబుగాఁ జెప్పి యొప్పించి మఱియును. 69

ఉ. మాయలమారులైన వెలమానిను లెక్కడ ! నేమపుంగతుల్
వాయకయుండు టెక్కడ ! ప్రపంచమునం దెటువంటివారలున్
రోయక యుందురే ! కడలుద్రొక్కిన దెట్టిలతాంగియైన దు
ర్జ్ఞేయము లీధనాంగనల చిత్తము లిందు భ్రమింప రుత్తముల్. 70

క. ఇంతకుమును మీతోడన్
మంతనమునఁ జెప్పినట్టి మాటలలో నొ
క్కింతయు నయథార్థముగా
కంతయు నిజమాయెఁగా యటంచు బలికినన్. 71

క. ఆతఁడు సెప్పిన మాటలు
చేతమ్మున కెక్కి దాని చేష్టలయందుం
బ్రీతి సెడి తనదు ప్రతిన ని
రాతంకముగా నొనర్చ నాత్మగతమునన్. 72

మ. గొనముల్సున్న, హుళక్కి సత్య మహహా ! కుర్మల్నభఃపుష్పముల్
మనముల్ సూడ శతావధానకృతులే, మానమ్ము కుందేటి కొ
మ్మని నీ వెల్లనెఱింగి వారసతి నాహా ! యెట్లు వాంఛించెదే !
మనమా ! వద్దిఁక నాదుమాటవినుమా, మర్యాదఁ గాపాడుమా ! 73

మ. 'ధననారీమణులెల్లఁ దుచ్ఛమతులే తథ్యమ్ముగాఁ జూడ నే
ధననారీమణిమాత్రి మొక్కటె మహాధన్యాత్మ కాఁబట్టి దీ
నిని వర్జింపుటకూడ' దంటి విపుడేనిన్ గూడునా, కూడదా ?
మనసా ! వద్దిఁక నాదుమాటవినుమా ! మర్యాదఁగాపాడుమా ! 74

క. ఈగతి దృఢనిశ్చయుఁడై
యాగరితకు వ్రాసెనిట్టు "లకటా ! యశమున్
బోఁగొట్టికొంటి నీయను
రాగము నిజమని తలంచి రమణీమణిరో. 75

క. చెలికాఁ డాడిన పలుకులఁ
గల యర్థం బెఱుఁగలేక కలికిరో ! నీవ
ల్కాలె వేదము లని మురిసిన
కలుషాత్మున కిట్టిఫలముఁ గలుగక యున్నే. 76

ఉ. నిన్ననసేల ! నీదు కులనీతి నెఱింగినవాఁడనయ్యుఁ దే
రెన్నికఁ గన్న సద్యశము నెంచక చంచలమానసుండనై
వన్నెయు వాసియున్ రుచిరవర్తనముం [illegible]
కన్నను మూర్ఖుఁ డింకొకఁడు గానఁగరాఁ [illegible] 77

చ. వలపు నిజంబటంచు మగువా ! మది [illegible]
యలు గలదాన వం చెఱుఁగనైతిఁ గదా ! [illegible]
దలయును వంచుకోవలెనెఁ దన్వి ! [illegible]
గలుగకపోయె నిట్లగునుగా ! [illegible] 78

ఉ. ఓవనజాక్షి ! నీదు కులయోగ్యత [illegible]
భావము నిల్పి పండితులఁ [illegible]
దే ! విధిచోదితుండనయి తేలిక [illegible]
గేవల కాలకర్మ గతికిం [illegible] 79

సీ. పుట్టినాఁడనుకదా ! ధన[illegible]
వైష్ణ[illegible]

చదివినాఁడనుకదా ! సకలవిద్యలను స
జ్జనులెల్ల మెచ్చంగఁ జందిరవదన !
తిరిగినాఁడనుకదా ! పరదేశములను వి
ద్యాపరిసంగములకై తలిరుఁబోఁడి!
పొందినాఁడనుకదా ! భూమిలో నీపాటి
వాఁడు లేఁడనుకీర్తి పద్మగంధి !

తే. గీ. అట్టి నాబోఁటి నీబోఁటియైనయొక్క
కాంత కాసించుచే యొక కాని మాట;
దానిలోన రసాభాసదశయుఁ గూడఁ
గలిగెనేనియుఁ జెప్పనా ! కలికి ! సుఖము.

క. ధన మీనో ? మన మీనో ?
చనవీనో ? నీదు జాతిచందము కాకు
న్నను నొకటి తక్కువున్నదె !
పని లేదిఁక నీ గుణంబు బయటం బడియెన్.

తే. గీ. కప్పుపుంబొడి పంకంబుఁ గలిపి దాని
యందుఁ గస్తూరిగూర్చి దోహదముచేసి
చొనిపి పన్నీటితోడఁ బెంచుదురుగాక
యున్నవాసన వాయునే ? యుల్లిగడ్డ.

తే. గీ. గతజలమ్మున కిఁక నానకట్టగట్ట
నేమియగు ? నీకు నాకును ఋణముదీఱె;
మంచిపనిఁ జేసితివి, నాదుమాట కేమి,
జగతి కుపకారమగు చర్య సలిపితీవు.

ఉ. వెలచెలులన్ వివేకులగు పెద్దలు పెండ్లికిఁ బిల్వరాదు; వా
రలు గల పెండ్లికిం జనఁగరాదు; జనం గనఁబోల దాటపా
టల; నదిగాక విద్యలఁ గడంగి వచింపఁగ రాదు; దీనికిన్
పొలసినవారికెల్ల మధుసూదను దుర్గతి రాక తీఱునే ?

తే. గీ. అనుచు నెఱుఁగంగ నేర్చినయట్టివారి
కెల్ల నెఱుఁగంగఁ జేసితి విందువదన!
యెఱుఁగ నేరనియట్టి సోమరుల కీవ
కాదు బ్రహ్మయు బోధింపఁగాఁ గలాఁడె! 85

క. నాకొక్కని కపకారము
చేకొని యొనరించి తంచు సిగ్గిలఁ దరుణీ!
లోకోపకారకంబగు
నీకృతికిన్ మెచ్చవలదె! నేర్పరు లెందుఁ." 86

క. అని కమ్మ వ్రాసి పిదపం
దనయంతన విడిచె దానిఁ దగ నమ్మధుసూ
దనుఁడు; మనము విఱిగినచో
వనితామణు లన్న గడ్డిపరకలు గారే? 87

క. వాసవునకైన ధనకాం
తాసంగతి వలదు, దానితత్త్వమ్ము రసా
భాసము నిక్కము; సుగుణ
వ్యాసంగులు దాని వారిఁ బడరెప్పట్లన్. 88

మ. అతఁ డీరీతిఁ బరిత్యజించుటయు నయ్యాజ్ఞాక్షియుం గొంతఁ దా
మతిఁ జింతించి క్రమమ్ముగా నతని ప్రేమ న్మాని పెన్మాయలాఁ
డితనం బూని స్వవృత్తి నెల్లి విటగోష్ఠిం జెంది పెంపొందె నా:
"గతిలేనమ్మకు గంజి పానక" మనంగా నిక్కమౌనే కదా! 89

సీ. తలిదండ్రు లింటిపెత్తన మొకింతక లోటు
జరుగకుండెడిరీతిఁ జక్కఁబెట్టి
ననుకూల మగుటీవిఁ దనకాంత తనకెంత
యును వస్త్ర వాసి నార్జనము సేయ
నతిభక్తి గలయిష్టులకు తెల్లవేళలఁ
దను గొల్చి బుద్ధిమత్తను భజింప

లక్ష్మీసరస్వతుల్ దమ పరస్పరవైర
ములవీడి తనగృహమ్మున వసింప

తే. గీ. బాంధవశ్రేణులెల్ల సెబా సనంగ
సకలదిగ్దేశరాజన్యసభలయందుఁ
దనయశమ్ము నిరంకుశత్వము వహింప
సుఖముగా నుండె నమ్మధుసూదనుండు. 90

క. సతతపరశ్శతభూదై
వతమృష్టాన్న ప్రదానవర్ధిత కీర్త్యం
చితతాదృశజనకయశో
వితతీ ! తతజగదతీతవితరణసుకృతీ! 91

మ. పరిపూర్ణాయురపారభాగ్యవిలసద్భావాంచితా ! కీర్తిసం
భరితాశాంతర ! సత్కవిత్వకుకవిత్వస్ఫూర్తినిర్భేదత
త్త్వరహస్యప్రథమానబుద్ధిబలసంతానాధికా ! నిత్యస
త్యరతా ! చెల్మయమంత్రిపుత్ర ! కవిరాడ్దారిద్ర్యవిచ్ఛేదకా : 92

క. నానాఫలపుష్పాగని
దానోద్యానాంతరస్థితసుసౌధతలా
మానబుధసుకవిమిత్రవి
తాన వినోదావధాన ! దాననిదానా ! 93

— గద్య —

ఇది శ్రీ....కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బయిన కేవలకల్పితం బగు శ్రవణానందం బను మహా
ప్రబంధమ్మునందు సర్వంబును పంచమాశ్వాసము
సంపూర్ణము.